పరగణాలలోని చాందాజిల్లాలో నాంధ్రభాషకు, కోంటావు, సాలేవారి, గోలరి అను నవియున్నవి. ఈమూడును వేర్వేరుగ నుపభాషలుగా నెంచుటకు వీలున్నను వానియుచ్చారణమును, సుప్తిఙంతవిధానమును నొక్కతీరుగనే యున్నవి. కర్ణాటక దేశములోను, బొంబాయి యందును, నాంధ్రమునకు సంబంధించిన కొన్ని యుపభాషలు కలవు. అవి కొన్నివృత్తులకు సంబంధించినవారి యాంధ్ర భాషా వికారములుగా నున్నవి. బెల్గాము జిల్లాలో బేరాది, దాసరి, యనుభాషలును, బొంబాయి పట్టణమునందలి కామాఠీభాషయును, బొంబాయిరాజధాని, బేరారు మొదలగు ప్రదేశములలో సంచారశీలురగు నొకజాతివారు మాటలాడు వడరీ భాషయును నట్టివి. ఇవియెవ్వియుఁగూడ సాధారణవ్యవహారభాష కెక్కువ విలక్షణములుగ నుండక పోవుటచే వీనినిగూడఁ బ్రత్యేకోపభాషలుగాఁ బరిగణింప నక్కఱలేదు.

---

## గ్రాంథిక భాష, వ్యావహారిక భాష.

---

భాష కేవలము వాగ్రూపముగా నున్నంతకాలమును మార్పులను పొందుచుండుట సహజము. కాని, దానిని వ్రాతరూపమునఁ బెట్టినప్పటి నుండియుఁ గొంత స్థిరత్వ మేర్పడుచుండును. వ్రాతను చదువనేర్చినవారు పూర్వకాలపు శబ్దస్వరూపమును నిలబెట్టుటకుఁ బ్రయత్నించుచుందురు. ఈ ప్రయత్నము సంపూర్ణముగా సాధ్యము కాకపోవచ్చును. లిఖిత భాషా స్వరూపము గూడ వ్యవహారభాష ననుసరించి మారుచుండుట యసంభవము కాదు. కాని వ్యవహారభాషయంత శీఘ్రముగ లిఖితభాష మాఱఁ జాలదు. కొన్నినాళ్ల కాభాషయం దుత్తమగ్రంథములు వెలువడినచో నాగ్రంథముల యందలిభాష తరువాతివారికి మార్గదర్శకముగా నేర్పడును. దానికొక ప్రమాణత్వము గలుగును. సాధ్యమగు నంతవఱకుఁ దరువాతివా రాభాషనే యనుకరింపఁ బ్రయత్నింతురు. అయినను, వ్యవహారభాషనుబట్టి యాగ్రంథకర్తల గ్రంథములందలి భాషాస్వరూపమును మాఱుచుండును. భావములనుబట్టియు రుచులనుబట్టియు నాయాగ్రంథకర్తల నుడికారము మారుచుండుట వింత గాదు. అందుచేత నిదియే ప్రమాణ గ్రాంథికభాషయని నిరూపింప వీలు లేదు. తొలుదొల్త వ్యావహారికభాషయే గ్రంథస్థమై యుండినను నానాఁటికిని దానికిని గ్రాంథికభాషకును నంతర మెక్కువయగుట సంభవించి, యారెండును వేర్వేరుగ నేర్పడుచుండును. గ్రాంథికభాష మిక్కిలి మెల్లగ మాఱుచుండు చుండ, వ్యావహారికభాష ముందంజవేయుచుఁ దన సహజమార్గమున మాఱుచుం

పొందుచుండును. ఏభాషకైనను నీగ్రాంథిక వ్యావహారికావస్థా భేదములు తప్పవు. ఇతరదేశములలో గ్రంథకర్తలీయంతరము నెక్కువగా నుండనీయక వ్యవహారమునే లక్ష్యముగ నుంచుకొని యుండ, భారతీయభాషలు గ్రంథస్థ భాషనే పరమలక్ష్యముగఁ జేకొనియుండుటచే వ్యవహారమునకును గ్రంథస్థ భాషకును మిక్కిలి యంతరమేర్పడినది. సంస్కృతభాషా ప్రాబల్య మిందుకు ముఖ్యకారణమని వేరేచెప్ప నక్కఱలేదు. సంస్కృతభాష పాణినీయాది వ్యాకరణములమూలమునను నిఘంటువులమూలమునను స్థిరీభూతమగుటచేతను, వ్యవహారభ్రష్టమగుటచేతను, నందు చాలవఱ కెట్టిమార్పును గలుగకుండెను. కాని నాఁటనుండి నేఁటివఱకుఁ బ్రవాహరూపమున వచ్చుచున్న జీవద్భారతీయ భాషలుగూడ సంస్కృతభాషానుయాయులగుటచే గ్రంథస్థభాషకును వ్యవహార భాషకును నింతటి భేదమేర్పడినది. ఈ యంతరముండుట మంచిదా కాదా యనువివాద మన్నిభాషలయందును గలదు. అన్ని ప్రాంతముల యందును వ్యావహారికభాష పూర్వకాలపు గ్రాంథికభాషను గొంతవఱకైనను త్రోసి పుచ్చి, యాస్థానము నాక్రమించుకొనుచున్నది. ఇట్లుండఁ బూర్వగ్రాంథిక భాషతోడి పరిచయము సంపూర్ణముగ లేకపోవుటచేతను, వ్యవహారము నతిక్ర మింప సాధ్యము కాకపోవుటచేతను, గ్రంథకర్తలు కొన్నికృతకరూపములఁ గల్పించుకొనుట సంభవించుచున్నది. ఈ కృతకరూపములు కొన్నిమొదల వ్యవహారములోఁగూడ స్థిరములగుట సంభవించుచుండును. ఈ రీతిగ నాంధ్ర భాషయందును వివిధములగు మార్పులు కలుగుచున్నవి. ఈ మార్పులన్నియు నేరీతిగ నేయేకారణములచేఁ గలిగినవో తెలియఁ జేయుటయే యాంధ్ర భాషా చరిత్ర ముఖ్యోద్దేశము.

---

## ఆంధ్రులు.

---

ఆంధ్రులను జాతివారినిగుఱించి మనకు వేదకాలమునుండియుఁ దెలియ వచ్చుచున్నది. ఐతరేయ బ్రాహ్మణమున నీక్రింది వాక్యములున్నవి. "తస్య హ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః; పంచాశత్ ఏవ జ్యాయాంసో మధుచ్ఛందసః; పంచాశత్ కనీయాంసః; తద్యే జ్యాయాంసో న తే కుశలమ్ మేనిరే. తాన్ అనువ్యాజహార 'తాన్వః ప్రజా భక్షీష్టేతి' త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనామ్ భూయిష్ఠాః"—పైదానిప్రకార మాంధ్రులు విశ్వా

మిత్రుని సంతానమైనట్లును, వారు పుండ్ర, శబర, పుళింద, మూతిబాది జాతులతో దస్యులుగాఁ బరిగణింపఁ బడినట్లును దెలియుచున్నది. మనుస్మృతిలో—
"కారవరం నిషాదాత్తు చర్మకారం ప్రసూయతే। వైదేహకా దంధ్రమేదా బహిర్గ్రామప్రతిశ్రయౌ" అని యున్నది. దీనిప్రకారము ఆంధ్రులు వైదేహకులకు జనించినవారనియు, వారు గ్రామములకు బయట నుండవలసిన వారనియుఁ దెలియుచున్నది. పురాణములలో నాంధ్రుల ప్రశంస గానఁబడుచున్నది. అంధ్ర, ఆంధ్ర శబ్దములు రెండును గానవచ్చుచున్నవి. వాయు మత్స్యపురాణములలో నంధ్రులను పేరును, వాయుపురాణమున నంధ్రియులను పేరును గానవచ్చుచున్నవి. భాగవత పురాణమున చాణూరమల్లుఁ డాంధ్రుడని యున్నది. మెగాస్తనీసు అను గ్రీకు రాయబారి యాంధ్రులను పేర్కొని యున్నాఁడు. అశోకుని శాసనములందు ఆంధ్రశబ్ద మున్నది. అశోకుని గిర్నారు శాసనములందు 'అంధ్ర పిరింద దేశు' అనియు, షాబాజుగిఢీ శాసనములందు 'భోజపితినికేషు ఆంధ్ర పులిదేషు' అనియు నున్నది. క్రీ. పూ. 150 సంవత్సరపు హాథీ గుంఫా శాసనమున నాంధ్రవంశములోని మూఁడవరాజగు శాతకర్ణి పేర్కొనఁబడి యున్నాఁడు. ఇతఁడు కళింగరాజగు ఖారవేలునకు సమకాలికుఁడు. కృష్ణాజిల్లాలోని చిన్నచిన్న యను గ్రామమునకు సమీపమున కృష్ణానదికి దక్షిణమున సముద్రతీరమున నాంధ్రరాజగు యజ్ఞశ్రీ గౌతమీపుత్ర శాతకర్ణి 27 వ రాజ్య సంవత్సరపు శాసన మొకటి దొరకినది. పులమావి యను నాంధ్రరాజు నేడవరాజ్యసంవత్సరపు శాసన మొకటి కార్లెయొద్దను, మఱియొకటి భిల్సానగరము నొద్దను దొరకినవి. గుంటూరుజిల్లాలోని యమరావతియొద్ద గౌతమీపుత్ర శాతకర్ణి తరువాత రాజ్యము నేలిన వాసిష్ఠీపుత్ర శ్రీపులుమావి శాసనము చిక్కినది. క్రీ. శ. 554 లోని హరహా శాసనమునం దాతఁ డాంధ్రపతిని జయించినట్లున్నది. విగ్రహపాలుని పంద్రెండవ రాజ్యసంవత్సరపు శాసనమున—"మహత్తమో త్తమకుటుంబి పురోధాన్ మేదాంధ్ర చండాల పర్యంతం" అని యున్నది. దీని ప్రకార మాంధ్రులు మేదులతోడను చండాలురతోడను చేర్పఁబడినట్లు దెలియుచున్నది. క్రీ. శ. 1115 సంవత్సరపు జాజల్లదేవుని రత్నపుర శిలాశాసనమున నాంధ్రకిమిడి, కోసలాంధ్ర కిమిడి యను నామములు గానవచ్చు చున్నవి. క్రీ. శ. 1171 సంవత్సరపు ముదగిహాల్లు శాసనమున బిజ్జలుఁడు ఘూర్జర మగధ కళింగాంధ్ర సౌరాష్ట్ర సేంగీ రాజులను జయించినట్లున్నది. క్రీ. శ. 1858 సంవత్సరపు ఒక శాసనమున ముమ్మిడి నాయకునిగూర్చి "ఆంధ్రశ్రీశో దేశానంధ్రాన్ రక్షితుం" అని యున్నది. క్రీ. శ. 1868 సంవత్సరపు సింగనాయకుని అక్కలపూండి శాసనమున నాంధ్రదేశప్రశంస యున్నది. క్రీ. శ. 1466 సంవత్సరపు వి[illegible]

దేవుని శ్రీశైల తామ్రశాసనము నందాతనికి ద్రావిడాంధ్ర మహీపతి అను బిరుదమున్నది.

పై శాసనములఁ బట్టియు నితరాధారములఁ బట్టియు నాంధ్రులు తొలుత మ్లేచ్ఛులుగాఁ బరిగణింపఁ బడియు నానాఁటికి దేశమంతటను వింధ్య పర్వత ప్రాంతములనుండి నానాముఖముల వ్యాపించి ప్రబలులై రాజ్యములు స్థాపించుకొన్నట్లును వారు వ్యాపించిన దేశమున కాంధ్రదేశమను సంజ్ఞ కుదురుకొన్నట్లును దెలియనగును. ఈ యాంధ్రదేశమును క్రీస్తు శకారంభమున శాతకర్ణులను వారు జయించి రాజ్యమును సాగించినట్లు గొందఱు చెప్పుదురు. శాతకర్ణు లాంధ్రులేయను వాదముగూడ గలదు. ఈ శాతకర్ణులలో గౌతమీ శాతకర్ణులు, వాసిష్ఠీపుత్ర శాతకర్ణులు, మాఢరీపుత్ర శాతకర్ణులు, అను మూఁడు విధములవా రున్నట్లు రాజుల పేళ్లనుబట్టి తెలియవచ్చుచున్నది. ఈ యాంధ్రరాజ్యము తూర్పుతీరమునుండి పడుమటితీరమునకు వ్యాపించినదో పడుమటనుండి తూర్పుతీరమునకు వ్యాపించినదో యను విషయమై వివాదము లున్నవి. కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళ మాంధ్రరాజులకు మూలస్థానమను వా రాంధ్రులు పశ్చిమమునకు వ్యాపించినట్లు చెప్పనగు. నాసిక మూలస్థానమను వా రాంధ్రులు తూర్పునకు వ్యాపించినట్లు చెప్పుదురు.

ఇట్లాంధ్రులనియు నాంధ్రదేశమనియు వ్యవహరింపఁ బడుచున్న శబ్దము లాంధ్రరాజుల శాసనములందు గానరాకుండుట చిత్రముగా నున్నది. ఆంధ్రభాషయను పేరుగూడ నాంధ్రరాజుల శాసనములందు గానరాదు. తిక్కన కాలమువఱకును తెనుఁగున కాంధ్రనామమున్నట్టు నిదర్శనములు లేవు. ఆంధ్రరాజుల శాసనములన్నియుఁ బ్రాకృతమునం దున్నవి. ఇవి నాసిక కార్లేయను పశ్చిమతీర ప్రదేశములనుండి గోదావరి కృష్ణానదీ మార్గముల ననుసరించి యిప్పటి యాంధ్రదేశమునకు గర్భమనదగు గుంటూరు సమీపమున నున్న అమరావతి, ధాన్యకటకము, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములందు నిబిడములై తూర్పు సముద్రతీరమున కృష్ణానదీముఖమువఱకు వ్యాపించి యున్నవి. ఈ శాసనముల భాష యాంధ్రభాష యనుకొనినచో నది నేఁటి తెలుఁగు రూపమునకు చాల్చువఱకు నెట్టి పరివర్తనములఁ బొందినదియుఁ దెలిసి కొన వచ్చును. ఈ యాంధ్రదేశపు భాష మొట్టప్రాకృత మనువిషయము వివిధాభిప్రాయములు కలవు. క్రీస్తు శకారంభమున నీ ప్రదేశమంతయు బౌద్ధమతాక్రాంతమై యున్నట్లు చరిత్రమువలనఁ దెలియుచున్నది. సింహళ ద్వీపమునం దేర్పడిన త్రిపిటకములను బౌద్ధ ధర్మగ్రంథములభాష పాలిభాష యని పిలువఁబడుచున్నది. ఈ పాలిభాష యొక్కఁడిదను విషయమును ఓల్డెన్ బర్గ పండితుఁడు తాను సంపాదించిన త్రిపిటకములను గ్రంథము రెండవ సం

7. పురవరస కులపురిస వరపరాగత విపులరాజసనిసి ఆగినూన[19]-
నిలయస సపురిసానం అసయస సిరీయ్ - అధితానస ఉపచారాస[20] సభవస
ఎక కుసస ఎకధనుధరస ఎక సూరస[21] ఎకబమ్హణాస రామ-

8. కేస - వాజున - భీమసెన - తులసరిసమస[22] ఛణాఘసి సిస-[23]
సమాజకారకస నాభాగ -[24] నహుస - జనమెజయ - సిగర - యయాతి -
రా - మాంబరీస - సమతెజస అపరిమితమ్ అఖయమ్ అచినిమ అభుత[25]
పవన - గరుళ -[26] సిధ - యఖ - రఖస - విజాధిర - భూత - గంధవ -
చారణ-

9. చద - దివాకర - నఖత - గహ - విచిణసమాగమసి జితరిపు
సఘసనాగ[27] వరఖధాగగన తలమ్ అభివిఘాఢస కులవిపులసిరి సిసిస సిరి -
సాతకణిస మాతుయ మహా - దెవీయ[28] గొతమియ బలసిరీయ సవచన
దాన ఖమా[29] హింసా[30] నిరతాయ తప - దమనియ-

10. మొపవాస తపరాయ రాజరిసి నధుసదిమ్[31] అఖిలమను-
విధీయమానాయ కారిత దెయ ధమ ... ... ... ...[32] సిఖసమపె తిరణ్హు -
పవతసిఖరె విమ్[33]. వర - నివిసెన మహిడ్డీక లెణ ఎతచ లెణ మహా దేవి మహా
రాజమాతా మహారాజప్ × తామహీ[34] దదాతి నికాయస భదావనీ-
యానం[35] ఖిఖుసఘస [36].

11. ఎతస చ లెణస చితణ నిమిత[37] మహా దెవీయ అయకాయ సెవ-
కామొ[38] పియకామొ చణట్ ... ... ... ...[39] పథసరా[40] పితుపతియొ ధమ
సెతుస దదాతి గామ[41] తిరణ్హు పవతస అపరదఖిణ పసె పిసాజిపదకం[42] సవజా
భొగనీరతి.

---

## షైడానిలో వివిధపండితులుచేసిన సవరణలు.

---

1. సిద్ధర. 2. °సితిపు.° 3. సవచ్ఛరే; సంవచ్ఛరే. ('పి' లో
'ఈ' స్పష్టముగా నున్నది. అశోకుని సాహస్రముశాసనములో 'సంవిచ్ఛల'
అని యున్నది. ప్రాకృతములో 'అ' 'ఇ' గా మారుటకలదు. 4. గిమ్హాన
5. అసిక - ససిక. 6. °పరాత°. 7. పరివార°— 8. 'లో' అంత స్ప
ముగా లేదు. 9. °మండల.° 10. రెండవ 'కర' లోని 'క' అంత స్ప
ముగా లేదు. 11. °పీనపట.° 12. 'ర' ను పండితులు పూరించిసినా
13. °సునుణ.° 14. 'దన' లోని 'న' మీాది తలకట్టు పరుండియున్న
'మదణస' అని లేఖకుని యుద్దేశమేమొ. 15. °వంస.° 16. °పతికా

అ = ఇ—ససిరీక (చంచరీక)

అ = ఒ—రయోణకస (యవనకస్య)

అఉ = ఓ—చఉత్థ, ఛోత్థ (చతుష్పథ)

అప = ఓ—ఓవరకో (అపవరకః)

అయ = ఏ—పరిహారేఠ (పరిహారయాథ)

అవ = ఓ—అనోమస (అనవమృశ్య) ; లోణ (లవణ)

ఆ = అ—అపరంత (అపరాంతి) ; పురిసాసం (పురుషాణాం) ; పరకమస (పరాక్రమస్య.)

ఇ = ఇ—సిద్ధం (సిద్ధం) ; వాసిఠీ (వాసిష్ఠీ.)

ఈ = ఈ—ససరీక (చంచరీక.)

ఈ = ఇ—పతిగయ్హ (ప్రతిగృహీత = పతిగహీఅ = పతిగహిఅ = పతిగయ్హ.)

ఉ = ఉ—రిపు (రిపు.)

ఉ = ఇ—పురిస (పురుష.)

ఉ = ఈ— దీహితు (దుహితుః.)

ఋ = అ—కణ్హగిరి (కృష్ణగిరి) ; వధి (వృద్ధి) ; గహపతి (గృహపతి.) తతియే (తృతీయే) ; పతిగహీత (ప్రతిగృహీత.)

ఋ = ఇ—సదిసే (సదృశే) ; కితాపరాధే (కృతాపరాధే.)

ఋ = ఇ = యి—పులమాయిస (పృథుమాతృకస్య.)

ఋ = ఉ—వుధిక (వృద్ధిక) ; సుజమాన (సృజ్యమాన) ; మాతు (మాతృ.)

ఋ = ర—రసి (ఋషి) ; రతు (ఋతు).

ఋ = రు—రుతుం (ఋతౌ.)

ఋ = రి—రాజరిసి (రాజర్షి.)

ఏ = ఏ—నివిసేన (నిర్విశేష.)

ఏ = ఇ—మహింద (మహేంద్ర.)

ఏ = అ—వాథవామ (వాస్తవ్యేషు.)

ఏ = ఓ—దో (ద్వే) ; ఇచ్చట వకారసంయోగమువలన నిట్టిమార్పు గలిగినది.

ఐ = ఏ—వేజయంతియే (వైజయంత్యాః) ; వేశాఖమాసె (వైశాఖ మాసె) ; చేతియ (చైత్య.)

ఐ = ఎ—నెకమ (నైగమ.)

ఐ = ఈ—ఏకీకస (ఏకైకస్య.)

ఓ = ఉ—ఏకునవీస (ఏకోనవింశతి.)
ఓ = ఓ—చకోగ (చకోగ); తోయ (తోయ.)
ఔ = ఓ—గోతమీా (గౌతమీా); పోర (పౌర); కోసిక (కౌశిక.)
ఔ = ఒ—ఒతరాహా (ఔత్తరాహా.)

---

## హల్లులయందలి మార్పులు.

---

గ = క—కాల (కాల.)
క = గ—గిలాన (క్లిన్నానాం.)
ఖ = ఖ—సుఖ (సుఖ.)
ఖ = ఘ—లేఘని (లేఖని.)
గ = గ—గిరి (గిరి); నోగమ (నైగమ.)
గ = క—సగిగ (సగిరి) ఈ మార్పు పైశాచీభాష ననుసరించి యున్నది.
చ = చ—చకోగ (చకోగ.)
చ = స—సేటగిరి (చైత్యగిరి); ససిరీక (చంచరీక.)
జ = జ—రాజ (రాజ.)
ట = ట—వాట (వాట.)
ట = డ—కుడుంబినియ (కుటుంబిన్యాః.)
డ = డ—మండల (మండల.)
డ = ళ—గరుళ (గరుడ); సోళస (షోడశ.)
ణ = ణ—బమ్హణస (బ్రాహ్మణస్య.)
ణ = స—పురిసాసం (పురుషాణాం.)
త = త—గోతమీా (గౌతమీా); తతియే (తృతీయే) - ఈ రూపము పైశాచీభాష ననుసరించినది-
త = ట—పటిపుణ (ప్రతిపూర్ణ); కటా (కృతా); ఉహారాటన (ఉహారాతస్య.)
త = థ—పథ (పతత్.)
త = అ = య—పతిగహీహ (ప్రతిగృహీత = పతిగహీఅ = పతిగహీయ = పతిగయిహా = పతిగహీహ.)
త = డ—సదకణి (శాతకర్ణి.)

త = డ—పడిక (ప్రతీక) ; అపడి దాతనా (అప్రతి దాతవ్యా.)

త = ర—సతరి (సప్తతిః.)

థ = ళ—పుళుమాయిస (పృథుమాతృకస్య.)

థ = ఠ—సురఠ (సురథ) ; పరిహాగేఠ (పరిహాదేథ.)

థ = ద—మదనస (మథనస్య.)

ద = ద—దివసే (దివసే) మందర (మందర.)

ద = ర—తేరస (త్రయోదశ) ; బారసక (ద్వాదశకే.)

ద = య—పాయూన (పాదోన.)

ధ = ధ—సిద్ధం (సిద్ధం.)

ధ = వ—నిధి (నివి) - ధకారము వకారముగ మారుటలేదేమో. నిధి—నిఇ, అయి వకారమాగమముగా వచ్చినది.

న = న—వాహాన (వాహాన.)

న = ణ—విచిణ (విచ్ఛిన్న) కుటుమ్బిణియ (కుటుంబినాయాః) ; ణియుత (నియుక్తా) ; మహామతేణ (మహామాత్యేన) ; కుటుంబికేణ (కుటుంబకేన) ; మహాసేణాపతిణియ (మహాసేనాపత్న్యాః.)

ప = ప—పీత (పీత) ; పటిపుణ (ప్రతిపూర్ణ.)

మ = మ—పంచమే (పఞ్చమే) ; మందర (మందర.)

య = య—తోయ (తోయ) ; మలయ (మలయ.)

ఇ = ఇ—పవఇత (ప్రవర్తయిత్ర.)

య = చ—పారిచాత (పారియాత్ర) ; - ఈమార్పు పైశాచీభాష ననుసరించి యున్నది.

య = జ—భరిజాయ (భార్యాయాః.)

ర = ర—రాజ (రాజ.)

ర = ల—నాలికేరాన (నారికేలానాం.)

ల = ల—మలయ (మలయ.)

ల = ర—నాలికేరాన (నారికేలానాం.)

వ = వ—దివసె (దివసె.)

వ = బ—బితీయె (ద్వితీయె.)

వ = అ = య—భయంత (భవంతః = భఅంత = భయంతి.)

వృ = ఉ—ఉసభదతేన (వృషభదత్తేన.)

శ = స—ఏకునవిస (ఏకోనవింశతిః); సాసనస (శాసనస్య) ; సుసూసా (శుశ్రూషా); నివిసేస (నిర్విశేష); సక (శక); వంస (వంశ) ; యసస (యశస

సాతవాహన (శాతవాహన) ; నిరవసేస (నిరవశేష) ; సిరసి (శిరసి) ; దాసక (దాశక); బాసక (వ్యాసశక); సత (శత); సోళస (షోడశ); కోసిక (కౌశిక.)

శ్య = స్స—అపావేస (అప్రావేశ్యమ్) ; అనోమస (అనవమృశ్యమ్.)

ష = ఛ—ఛ్ఛతే (సుస్తి.)

ష = స—నిసూగసన (నిషూగసస); సహలస (సహలష); అంబరీస (అంబరీష) ; నివిసేస (నిర్వ్యాశేష) ; ఉసభదతేస (వృషభదత్తేన) ; సోళస (షోడశ.)

స = స—గసస (గసస్య) ; సిద్ధం (సిద్ధం) ; సమసారస (సమసారస్య.)

ః = ఓ—గామో (గ్రామః) ; తతో (తతః.)

హ = హ—హిమవతే (హిమవత్.)

హ = ఖ—ఖఖరాత (క్షహరాత.)

---

## సంయుక్తాక్షరములు.

---

క్త = త్త—వతవ్వో (వక్తవ్యః) ; విభతా (విభక్త.)

క్ర = క్క—వికమ (విక్రమ) ; పరకమ (పరాక్రమ.)

ఃఖ = ఖ్ఖ—సుఖ్ఖ (సుఃఖ.)

క్ష = ఖ—ఖహరాటస (క్షహరాతస్య.)

క్ష = ఖ్ఖ—అఖ్ఖయ (అక్షయ); ఉపగఖ్ఖితో (ఉపగక్షితః); పఖ్ఖే (పక్షే); అఖ్ఖయం (అక్షయం); యఖ్ఖ (యక్ష) ; రఖ్ఖస (రాక్షస) ; నఖ్ఖత (నక్షత్ర) ; దఖ్ఖిణ (దక్షిణ.)

క్ష = ఖ—ఖేతస (క్షేత్రస్య); ఖతియ (క్షత్త్రియ) ; ఖఖరాత (క్షహరాత.)

జ్ఞ = ఞ—ఞాయతే (జ్ఞాయతే.)

జ్ఞ = ఞ్ఞ—యఞ్ఞ (యజ్ఞ) ; అఞ్ఞాతియ (అజ్ఞప్తా య్) ; రఞ్ఞో (రాజ్ఞః.)

జ్ఞ = ణ—ఆణత్తం (ఆజ్ఞప్తమ్.)

జ్ఞ = న—ఆనపయతి (ఆజ్ఞాపయతి.)

జ్య = జ్జ—భోజ్జా (భోజ్యాః) ; సుజ్జమాన (సృజ్యమాన.)

త్త = య్య—దేయ్య (దత్త.)

త్స = స్స—తస్సర (తత్సర.)

త్య = త్త—మహామత్తేణ (మహామాత్యేన.)

త్య = చ్చ—అమచ్చ (అమాత్య.)

త్య = త్త = ట్ట—సెట్టగిరి (చైత్యగిరి = చెత్తగిరి = సెట్టగిరి.)

త్ర = త్త—నఖత్త (నక్షత్ర); చిత్తేణ (చిత్రేణ) ; సతుసఘస (శత్రు సంఘస్య) ; పుతస (పుత్రస్య.)

త్ర్ర = త్త—ఖత్తియ (క్షత్త్రియః.)

త్వ = త్త—సత్తకం (సత్త్వకమ్.)

త్స = స్స—ఉస్సవ (ఉత్సవ.)

త్స = చ్ఛ—సంవచ్ఛరే (సంవత్సరే.)

త్స్య = చ్ఛ—మచ్ఛ (మత్స్య.)

ద్య = జ్జ—విజ్జాధర (విద్యాధర.)

ద్ర = ద్ద—చంద్ద (చంద్ర) ; మహింద్ద (మహేంద్ర) ; సముద్ద (సముద్ర.)

ద్వ = ద—దో (ద్వే.)

ద్వ = బ—బారసక (ద్వాదశకః) ; బే (ద్వే.)

ధ్య = ఝ్ఝ—వింఝ్ఝ (వింధ్య.)

బ్ద = ద్ద—సద్దస (శబ్దస్య.)

భ్య = బ్భ—అబ్భంతరం (అభ్యంతరమ్.)

ర్ఘ = ఘ్ఘ—దిఘ్ఘ (దీర్ఘ.)

ర్జ = జ్జ—అజ్జున (అర్జున) ; ధమ్మోపజ్జిత (ధర్మోపార్జిత.)

ర్ణ = ణ్ణ—చాతువణ్ణ (చాతుర్వర్ణ్య) ; పటిపుణ్ణ (ప్రతిపూర్ణ.)

ర్త = త్త—నివత్తన (నివర్తన) ; వినివత్తిత (వినివర్తిత.)

ర్థ = ద్ద—చోద్దె (చతుర్థే.)

ర్ధ = ద్ధ—గోవద్ధనె (గోవర్ధనే) ; ధనుద్ధరస (ధనుర్ధరస్య) ; వివద్ధనస (వివర్ధనస్య.)

ర్ప = ప్ప—దప్ప (దర్ప.)

ర్భ = బ్భ—గబ్భం (గర్భం) ; నిబ్భయ (నిర్భయ) ; వివబ్భ (వివర్భ.)

ర్గ = గ్గ—చతుగ్గబ్భం (చతుర్గర్భం.)

ర్మ = మ్మ—ధమ్మ (ధర్మ.)

ర్య = య్య—ణియ్యాచితం (నిర్యాచితం.)

ర్వ = వ్వ—గంధవ్వ (గంధర్వ) ; చాతువణ్ణ (చాతుర్వర్ణ్య) ; నివ్విసేస (నిర్విశేష) ; సవ్వ (సర్వ) ; పవ్వత (పర్వత.)

ర్శ్వ = స్స—పస్సే (పార్శ్వే.)

ర్ష = స్స—వస్సపత్తే (వర్షపత్తే) ; దుప్పధస్సనీయ (దుష్ప్రధర్షణీయ.)

ల్య = ల్ల—ముల్లేన (మూల్యేన.)

(గ్రహా) ; పతిఠాపన (ప్రతిష్ఠాపన) ; యస (యశస్) ; నమ (నమస్) ; తప (తపస్) ; ఏకోనవీస (ఏకోనవింశతిః.)

అక్షరలోపమును బూర్తిచేయుటకుఁ బూర్వాచ్చునకు దీర్ఘము:—

వాస (వర్ష) ; నియాంతితం (నియంత్రితమ్) ; దాతామిత్రి (దత్తామిత్రీ) ; సాతమే (సప్తమే.)

అక్షరప్లుతి

నాలిగేరాన (నారికేలానామ్) ; వసపుథ (వా స్తవ్య.)

తాలవ్యీకరణము.

త్రయోదశ = తేరస.

హల్లులకు లేని ఒత్తువచ్చుట.

చఉత్థ = ఛోత్థ = చతుర్థ ; ఛోత్థే = చతుర్థే.

---

విభక్తులు.

---

సంస్కృతములో నెట్టియంతముగల శబ్దమైనను అకారాంత శబ్దతుల్యత్వమును బొందుచున్నది. అకారేతరాచ్చులుగల శబ్దములు కొన్ని యున్నను వానికి అకారాంతశబ్దములకువలెనే విభక్తిప్రత్యయములు చేరుచున్నవి. హలంతశబ్దములందలి తుదిహల్లునకు లోపమైనను కలుగుచున్నది; లేదా, తుదిహల్లుపై అకారముచేరి యది అకారాంత శబ్దముగానైనను మారుచున్నది:—

హిమవత్ = హిమవత ; ఏకోనవింశత్యామ్ = ఏకునవిసే ; సేతోః = సేతుస ; రాజ్ఞః = రాజస ; పతేః = పతిస ; రుచేః = రుచిస ; తేజసః = తేజస ; శాతకర్ణినః = సాతకణిస; అష్టమ్యాం = అఠమియం ; చతుర్దిశాయాః = చాతుదిసస ; అనుభూతేః = అనుభూతిస ; వసంతానామ్ = వసంతానాం ; పుఙ్గమాయిన.

సంస్కృతములోని ద్వివచనము లోపించి దానిస్థానమున బహువచనమే వచ్చుచున్నది:—

మాతాపితృభ్యామ్ = మాతాపితుహి = మాతాపితృభిః , మాతాపిత్రోః = మాతాపితిరో ; పోథీ = రెండు కుండములు = పోథియో ,

## పంచమ్యేకవచనము.

ఇందు అత్ ప్రత్యయములోని తుదితకారము లోపించును:—ఖధా (స్కంధాత్); ఖధావారా (స్కంధావారాత్); భటాగరా (భట్టాగ్రకాత్.)

పంచమ్యేకవచన షష్ఠ్యేకవచనములందు స్త్రీలింగ శబ్దములకు వలె కొన్నిరూపములు గానవచ్చుచున్నవి:—అనువిధీయమానాయ (అనువిధీయమానాయాః); మాతుయ (మాతుః); మహాదేవీయ (మహాదేవ్యాః); గోతమియ (గౌతమ్యాః); బలసిరీయ (బాలశ్రియాః); నిగతాయ (నిర్గతాయాః); పరాయ (పరాయాః); కుటుంబిణియ (కుటుంబిన్యాః); నందసిరియ (నందశ్రియః); దుహుతుయ (దుహితుః); అంతేవాసినియ (అంతేవాసిన్యాః); పవయితాయ (ప్రవ్రజితాయాః); తాపసినియ (తాపసిన్యాః); భటపాలికాయ (భటపాలికాయాః), భారియాయ (భార్యాయాః); ఖపణకమాతుయ (క్షపణక మాతుః); ఉపాసికాయ (ఉపాసికాయాః); ముఖ్యాయ (ముఖ్యాయాః); భరిజాయ (భార్యాయాః); సేనాపతిణియ (సేనాపతిన్యాః); నాసయ (నాసాః) కణ్హాహినియ (కణ్హాహినేః); సఖిమిత్రాయ (సఖీమిత్రాయాః); వీసాయ (వింశత్యాః); ఉజెనియ (ఉజ్జయిన్యాః); బహసయ (బాహాసన్యాః) ఉపాసికాయ (ఉపాసికాయాః); విణ్హుదతాయ (విష్ణుదత్తాయాః); జీవసుతాయ (జీవసుతాయాః); రాజమాతుయ (రాజమాతుః); రఖితుయ (రక్షితుః); లోటాయ (లోటాయాః); అఙ్ఖాతియ (అజ్ఞప్త్యాః); నగరసీమాయ (నగరసీమ్నః); నిగమసభాయ (నిగమసభాయాః.)

పితుపతిరో (పితుఃపతేః); సేనాయే (సేనాయాః); విజయంతియే (వైజయంత్యాః)-అనురూపములును, పురిసదతాన (పురుషదత్తస్య); నందాసిరియావ (నందాశ్రియః)- అనురూపములును, తసిల్ ప్రత్యయములో, ఖేతాతో (క్షేత్రతః) అను రూపమును గానవచ్చుచున్నవి.

## షష్ఠ్యేకవచనము.

రాజస (రాజ్ఞః); పతిస (పతేః); సాసనస (శాసనస్య) వాహానస (వాహానస్య); వదనస (వదనస్య); అమచస (అమాత్యస్య); సామకస (సామకస్య); సాతకణిస (శాతకర్ణినః); వసథస (వాస్తవ్యస్య); పవతయితుస (ప్రవర్తయితుః)- వైవానిలోని స అను ప్రత్యయము శబ్దముల యంతిములో నిమిత్తము లేకుండ నుపయోగింపబడినది.

## షష్ఠీ బహువచనము.

భదావనీయానం (భద్రావనీయానాం) ; పవజితాన (ప్రవ్రజితానాం) తేకిరసిణ (తైకిఋషీణాం) ; పతివసతానం (ప్రతివసతాం) ; వాసాన (వర్షాణాం) ; గిమ్హాణ (గ్రీష్మాణాం) ; సవసానం (సవసానాం) ; ఉతమభద్రకానం (ఉత్తమ భద్రకానాం) ; ఖతియానం (క్షత్రియాణాం) ; భిఖూనం (భిక్షూణాం) ; తెరణ్హికానం (త్రిరశ్మికానాం) ; వసంతానం (వసతాం) ; వసఉధాన (వాస్తవ్యానాం) ; నాలిగేరాన (నారికేలానాం) ; దేవానం (దేవానాం) ; బ్రాహ్మణానం (బ్రాహ్మణానాం) ; సహసణం (సహస్రాణాం) ; గిలాన (క్లిన్నానాం) ; హేమతాణ (హేమంతానాం) ; నాసికికానం (నాసికకానాం) ;

---

## సప్తమ్యేకవచనము.

గిమ్హాణపఖే (గ్రీష్మాణాం పక్షే) ; బితీయే (ద్వితీయే) ; తేరసే (త్రయోదశ్యాం) ; తిరణ్హిమ్హి (త్రిరశ్మిని) ; అనుగామిమ్హి (అనూగామిని) ; రాజిని (రాజని) ;

---

## సప్తమీ బహువచనము.

కఖడీసు (కఖడీషు) ; వాస్తవ్యసు (వాస్తవ్యేషు) ; ఆగతానాగతాసు (ఆగతానాగతేషు.)

---

## క్రియలు

ఈక్రింది క్రియారూపములు కానవచ్చుచున్నవి. భవిసంతి (భవిష్యంతి); నిబధాపేథ (నిబద్ధాపయథ) ; వసతి (వాస్యతే) ; కసతే (కృష్యతే)—ఆత్మనే పదిరూపమిది యొక్కటియే కానవచ్చుచున్నది.

అపావేస (అప్రావేశ్యం) ; అనోమస (అనవమృశ్యం.)

---

## సర్వనామములు.



అమ్హేహి (అస్మాభిః); అమ్హ (అస్మాకం.)
ఏథ (ఏతత్); ఎతత (ఏతత్); ఏతో (ఏతత్) ?
ఏతహి, ఏతేహి (ఏతైః); ఏతస (ఏతస్య); ఇమేస ([illegible]) ?
సో (సః); నేన (అనేన); య (యద్).



## అవ్యయము.



దాని (ఇదానీం.)



## సంధి.

అప + అవసితం = అపయవసితం.



## కారకము.

నమ భగతస జినవగస బుధస (నమోభగవతే జినవ[illegible]య బు[illegible]య.)



## ఈక్రింది గ్రామముల పేళ్లు కానవచ్చుచున్నవి.



చలిసీలణ, నాసిక, ధంభిక, దసపుర, ఛాకలేప, [illegible], కేకాపుర, ఉజేని, కాపురాహార, చిఖలపద్ర, [illegible], [illegible], రామతీర్థ, గోవర్ధన, శొర్పారగ, భరుకచ్ఛ, బెనాకటక, [illegible], [illegible], సుదసన, నవనర, పిసాజపతకం.



## ఈక్రింది మనుష్యుల పేళ్లు కానవచ్చుచున్నవి.



ధమ్మదేవ, ఈంద్రాగ్నిదత, మాఢరీపుత, శివదత్తాభీర, [illegible], ఈశ్వర సేన, సకగివమ్మ, గణపక, రేభిల, విసవర్మ, సకనిక, శివమిత, [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible]

సదాసిరీ, సాదవాహన, కన్హ, మమ్మా, భవగోప, బొపకి, దామచిక, పులుమాఇ, ధణమ, సాతకణి, విణ్హుదత, తుహారాత, తుతప, నహాపాన, దీనీక, ఉష-వదాత, గోతమిపుత, సదకణి, విణ్హుపాలిత, అవరకఖడి, సివగుత, మిధున, పుళుమవి, సవస.

---

### ఈక్రింది సంఘముల పేర్లు కానవచ్చుచున్నవి.

---

ఉత్తమభాద్ర (యోధులసంఘము); (తేకిరసి, ఒక యతులసంఘము); భదాయనీయ (భిక్షుసంఘము); చతిక (ఒక భిక్షుసంఘము); కులరిక శ్రేణి (ఒక యంత్రిక శ్రేణి,) తిలపిషక శ్రేణి, (వృత్తులకు సంబంధించిన సంఘములు.)

---

### పర్వతములు.

---

తిరణ్హు, గోవధన,

---

### నదుల పేళ్లు.

---

బెణ్ణాకా, ఇబా, పారాదా, దమణ, తాపీ, కరబేణా, దహానుకా,

పై దానినిబట్టి యాంధ్రరాజుల శాసనములభాష పాలిభాషకు మిక్కిలి దగ్గఱగనున్నట్లుఁ దెలిసికొనవచ్చును. నాసికయందే కాక నేటి యాంధ్రదేశమునఁ గానవచ్చిన యాంధ్రరాజుల ప్రాకృత శాసనముల భాషయుఁ బై దానినే పోలియుండును. ఆంధ్రదేశమున నశోకుని శాసనములు మొన్నటివఱకును దొరకలేదు. అనంతపురముజిల్లాలోని గుత్తి కేడుమైళ్ల దూరముననున్న యెఱ్ఱగుడి గ్రామమునకు సమీపమున చిన్నగుట్టలపై చెక్కఁబడియున్న యశోకుని పదునాలుగు శిలాశాసనములను నేను స్వయముగ ప్రథమమునఁ గనుగొని వాని ప్రతులనెత్తి చేదివితిని. అందలి రెండుశాసనముల నీక్రింద నుదాహరించుచున్నాను.

---

### ఏడవ శిలాశాసనము.

---

1. దేవానంపియే పియదసినే లాజా సవతా ఇఛతి.

(దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా సర్వత్ర ఇచ్ఛతి.

2. సవపాసండ వసేయు సవే హి తే సయమం భావసుధిం చా
(సర్వేపాషండా వసేయుః సర్వే హి తే సంయమం భావశుద్ధిం చ.)
3. ఇఛంతి జనేచు ఉచావుచఛందే ఉచావుచలాగే తే సవం ఏక
[దేశం పి
(ఇచ్ఛంతి జనః తు ఉచ్చావచచ్ఛందః ఉచ్చావచరాగః తే సర్వం
[ఏక దేశ మపి.)
4. కఛంతి విపులె పి చు దానే అస నథి సయమే భావసుధి కిటనాతా
(కరిష్యంతి విపులమపి తు దానం యస్య నాస్తి సంయమో భావ
[శుద్ధిః కృతజ్ఞతా.)
5. దిఢభతితా చా నిచే బాఢం
(దృఢ భక్తితా చ నీచా బాఢం.)

---

## తెనుఁగు.

---

దేవానాంప్రియుఁడు ప్రియదర్శిరాజు సమస్తజనులను తమ యిచ్ఛ వచ్చినచోట వసింపవచ్చునని కోరుచున్నాఁడు. వీరందఱును సంయమమును భావశుద్ధిని, కోరుదురుగదా. కాని జనులు వేర్వేరు కోరికలను, వేర్వేరు రాగములను కలిగిఉందురు. వారు తమధర్మములలో అన్నిటిని గాని, కొన్నిటిని మాత్రముగాని నిర్వర్తింతురు. విపులమైనదానమును, సంయమమును. మనశ్శుద్ధియు, కృతజ్ఞతయు, దృఢభక్తియు లేనివాఁడు తప్పక నీచుఁడగును.

---

## 11–వ శిలాశాసనము.

---

1. దేవానంపియే హేవం ఆహా నథి ఏదిసే దాన యదిసే ధంమదానం
[ధంమసంథవే.
(దేవానాంప్రియః ఏవం ఆహా నాస్తి ఈదృశం దానం యాదృశం)
[ధర్మదానం ధర్మసంస్తవః)
2. ధంమస విభాగే ధంమసంబంధే తత ఏస దాసభటకసి.
(ధర్మసంవిభాగః ధర్మసంబంధః తతః ఏషా దాసభృతకే.)
సంమ్యాపటిపతి మాతాపితు సుసుస.
(సమ్యక్ప్రతిపత్తిః మాతాపితృ శుశ్రూషా.)

3. మిత్రసంథుత నాతికానం సమంన బంభనానం దానే పానానం.
(మిత్రసంస్తుత జ్ఞాతికానాం శ్రమణ బ్రాహ్మణానాం దానం [ప్రాణానాం.)

అనాలంభే ఏస వతవియే పితినాపి.
(అనాలంభః ఏతద్ వక్తవ్యం పితృణాపి.)

4. పుతేనపి భాతినాపి సువామిక్యేపి మిధసంథుథేనాపి అపటి.
(పుత్రేణాపి భ్రాత్రాపి స్వామికేనాపి మిత్రసంస్తుతేనాపి ప్రాతి.)
వేసియేనా ఇయం సాధు ఇయం కటవియే సే తథా.
(వేశికేన ఇయం సాధుః ఇయం కర్తవ్యం స తథా.)
కలంత హిదలోకే చ కం ఆలథే.
(కుర్వన్ ఇహలోకే చ ఆరాద్ధవాన్.)

5. హోతి పాలత చ అనంతపునా ప్రసవతి తేన ధంమదా.
(భవతి పరత్ర చ అనంతపుణ్యం ప్రసూతే తేన ధర్మదా.)

6. నేన
(నేన.)

---

## తెనుఁగు.

దేవానాం ప్రియుఁ డిట్లు చెప్పుచున్నాఁడు. ధర్మదానము, ధర్మసంస్తవము, ధర్మవిభాగము, ధర్మసంబంధము అనువానిని పోలిన ధర్మము లేదు. అందుచేత దాసభృత్యులయెడల ప్రతిపత్తి, తల్లిదండ్రులశుశ్రూష, మిత్రులు, పరిచితులు, బంధువులు, శ్రమణులు, బ్రాహ్మణులు అనువారికి దానము, ప్రాణులను హింసింపకుండుట, (అనునదే ధర్మవ్రతము) ఈ ధర్మవ్రతమును గుఱించి తండ్రితోఁగాని, కొడుకుతోఁగాని, సోదరునితోఁగాని, పరిచితునితోఁగాని కేవలము ఇరుగుపొరుగువారితోఁగాని, ఇది సాధువు, ఇది కర్తవ్యము, అని చెప్పవలెను. ఇట్లుచేసి, అధర్మనాశమువలన ఈ లోకమందు సౌఖ్యమును, పరలోకములో అనంతపుణ్యమును పొందును-

ఈ క్రిందిశాసన మాంధ్రదేశమునకుఁ బ్రత్యేకముగా నశోకునిచే వ్రాయఁబడినది. దీనిప్రతి భారతవర్షమున మఱియెందును గానరాదు.

1. (అసక) స దేవానంపియే హే పి మ చ ఏకాని.
(అశోకః దేవానాంప్రియః ఆహ అపి మమ చ ఏకోన.)

10. య దేకే ఓనపేం భవాయే రం నహావా వాఉసో వా.
(య దేకే అవనిపా భవేయుః రాజానః యే వ్యాపృషో వా.)
ఏఘసి భాఅపవధియా దేయా వివ
(సన్ధయిష్యంతి భాసప్రవృద్ధ్యై ధియా వివ-)

11. ఎనే ఆపెంపిస జనో దత మభోడస అతనం ధనపియానె సావం-
(గ్ధనా అగ్రమపి స జనో దత్త మభూ త్తస్య అర్థానాం ధనప్రియా
[నిశ్శాలవ-)

యఇ.
( ఋత వ్యాః.)

12. సంయుస సుతిరా వుతాని చా సుసితవియే జయేయ.
(ప్రజ్ఞాస సుస్థిర స్మృత్యాః చ సుశ్రావయితవ్యాః జయాయ.)
నపె ఏయే అ సయుధుకదే.
(స్మృధ్ద్యై ఏనం ప్రమత్నీ కృతం.)

13. సిసువాయ హామేన గచు పు సుసువియానహా భడే.
(సుశ్రావణేస అహామేవ గచ్ఛామి పునః శుశ్రావణాయ వా
[అహంభటః.)

ఆతిథకథా అపి ఆయే పినవా.
(యథా (తథా) కథమపి ఆగమిష్యామి పున ర్వా.)

14. సుసుమ ధంమశాన పనతితని యయేచు దయాని య దయితవయ.
(శుశ్రూషా ధర్మశాసన ప్రవర్తితాని యానియాని తు దత్తాని
[యాని జ్ఞాతవ్యాని.)

నపే సేతివయే.
(సర్వాణి వర్తితవ్యాని.)

15. యథుసథ మూత్ఫే సపోకాపునకోభి ఇయం సుంసుసిత తపంతి.
(యథాసత్ర మూద్పశిసః ఉపాసకారిణః అపి ఇమం శ్రావయిష్యంతి.
పయోగాథ దేవానంపియ వచనేన హా
(ప్రయుక్తాః దేవానాంప్రియ వచనేన అ-)

16. థ లంగ తేవాసిని యారాసా ధంమవధకి భికాని యధారపవియ
(థ లంతేవాసినః యాదృశా ధర్మవర్ధకా భిక్షుకాః ... ... ...)
అనాని వేసుఞ హాంవనిపయా అవమ.

17. యస యథా వంఝోన ఆచుదయస నాభాకా భాభవారయే యాద-నా పతాయనాయ వామచే దసమోసయా.

18. పరేపచాసి సుయధారప వ ర్షె అసంపయాసా భికిసు సేస భాభవి యే పేవమే.

19. భా రేకసి యాహవంస థానీవసధారి నా సేయిాభా యధారపసథం సాప.

20. వసధపేచ అభచాసి యుపయ.

21. ఖాయధన ఆయాపింనవా.

పై శాసనములలోని యక్షరములన్నియు సుస్పష్టముగా నున్నను పంక్తి లొకదానిలోని కొన్నిటి సంక్రమించియుండుటచేత నొక పంక్తిలోని యక్షరములు మఱియొక పంక్తిలోనివిగాఁ జేరుపఁబడినవేమో యను సందేహము గలుగుచున్నది కావున నీ శాసనము నర్థమును వివరింపలేను. పై శాసనములకును నాసికయందలి శాసనములకును గల ముఖ్యభేదము రేఫములు లకారములుగా మాఱుటయని గుర్తింపవచ్చును. ఈమార్పు పైశాచీ మాగధీ భాషలకుఁ బ్రత్యేకలక్షణముగా లాక్షణికులు చెప్పియున్నారు.

సంస్కృతములోని చాల నక్షరములు లోపించుటయు నేకపదమునందే యచ్చులు ప్రత్యేకముగ నెట్టి యాగమాక్షరములు లేకుండఁగను, సంధి కాకుండఁగను వ్రేలాడుచుండుటయు లాక్షణికులు దెలిపిన మాహారాష్ట్ర్యాది ప్రాకృతములందు గానవచ్చును. కాని వ్యవహారమునం దాయచ్చులకు సంధి యగుటయో వాని మధ్యమున నాగమహల్లులు చేరి వానిని బంధించుటయో సంభవించెను. ఇట్టిమార్పులు జరిగిన భాషలలో నర్ధమాగధి, జైనమాహారాష్ట్రి, జైనశౌరసేని, పాలి, యనునవి ముఖ్యములు. వీనిలో నర్ధమాగధి, జైనమాహారాష్ట్రి, జైనశౌరసేని, యను భాషలయందు జైనమతగ్రంథములు విస్తారముగ వెలువడినవి. పాలిభాషయందు బౌద్ధమతగ్రంథములు వెలసినవి. వీనిలో గ్రంథస్థములైన భాష స్థిరమై, లక్షణబద్ధమై చాలవఱకు మాఱకుండ నిలిచిపోయినది. కాని వ్యవహారమునందలి భాష నానాఁటికిని మార్పునొందుచునే యుండెను. దక్షిణహిందూదేశమున నించుమించుగ క్రీ. శ. 6-వ శతాబ్దము వఱకును బ్రాకృతభాషలు తప్ప నితరభాషలు ప్రచారములో నుండినట్లు గానరాదు. తమిళభాష క్రీస్తునకుఁ బూర్వమునుండియుఁ బ్రచారములో నుండెడిదను నభిప్రాయము నేడు విడనాడఁబడుచున్నది. క్రీస్తుశకము 6, 7. శతాబ్దములవఱకు ద్రావిడ భాషలలో సంవత్సరములు నిరూపింపఁబడిన శాసన

ములు గాన్పింపవు. క్రీస్తుశకము 4, 5, శతాబ్దములనుండియుఁ బల్లవరాజుల కాలమున సంస్కృతమునకుఁ బ్రాధాన్యముగలిగి ప్రాకృతముల ప్రచారము వెనుకపడినట్లు గాన్పించును. ఈలోఁగాఁ బ్రాకృతము మార్పుఁజెందుచు వచ్చెను. దానికిని నితరభాషలకును వ్యవహారమునఁ దొలుతనుండియుఁ గలుగుచుండిన సంపర్కమువలన గ్రంథస్థలాక్షణిక ప్రాకృతమని గుర్తింపరాని యొక యవస్థ యేర్పడెను. ఈ తొల్లింటి ప్రాకృతమే మార్పునొందుచు నేఁటి యాంధ్రభాషగాఁ బరిణమించినదా ? అట్లైనచో నా పరిణామక్రమ మెట్టిది ? ఆ ప్రాకృతభాషా స్వరూపమెట్టిది ? దానితో మేళనముఁ బొందిన యితర భాషల స్వరూపమెట్టిది ? ఆంధ్రమునకును నితర ద్రావిడభాషలకును గల సంబంధమేమి ?—అను విషయములను గూర్చిన చర్చ యీ గ్రంథమున నందందు గాన్పింపవచ్చును. ఆంధ్రము ప్రాకృతభాషా వికారమగునేమో యను దృష్టితో నీగ్రంథము వ్రాయఁబడుటచేఁ బ్రాకృత భాషలగూర్చిన ప్రశంస యింతెక్కువగాఁ గాన్పించును.

ఈభాష కాంధ్రమను పేరు నన్నయభట్ట రచితమైన నందంపూడి శాసనమునఁ దొలుతఁ గానవచ్చుచున్నది. అందాతఁడు నారాయణభట్టు నాంధ్రభాషాకవీశ్వరునిగాఁ బేర్కొనియున్నాఁడు. ఆనాఁటికే యీభాషకుఁ దెనుఁగను నామము గుదురుకొనియుండెను. భారతమును తెనుఁగున రచింపుమని రాజరాజు తన్నుఁ గోరినట్లు నన్నయభట్టు చెప్పియున్నాఁడు. ఈ తెనుఁగను పదము స్వరూపమునుగూర్చి విచారింతము.

తెలుఁగనుపదము త్రిలింగ శబ్దభవమని పండితుల యభిప్రాయము. ద్రాక్షారామ, శ్రీశైల, కాళహస్తులను మూఁడు ప్రసిద్ధ శైవక్షేత్రములకు నడుమనున్న దేశము త్రిలింగమనియు నదియే తెలుఁగుదేశమనియు నప్పకవి చెప్పియున్నాఁడు. అంతకుఁబూర్వము కాకతీయులు రాజ్యముచేసిన దేశమునకుఁ ద్రిలింగమని యనుకొనుచుండినట్లు విద్యానాథ కవికృతమగు ప్రతాపరుద్రీయమునఁ బ్రతాపరుద్రుఁడు త్రిలింగాధిపతియని చెప్పఁ బడుటచేఁ దెలిసికొనవచ్చును. అంతకుఁ బూర్వము తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ యుండెనో లేదో తెలియదు. శాసనములం దీదేశమునకు తెలింగ, తెలుంగ, తిలుంగ, తిలంగ, తెలగ, తిలింగ, యను పేళ్లు గానవచ్చుచున్నవి. శా. శ. 1194 ప్రాంతముల రాజ్యమేలిన యాదవరాజగు రామచంద్రునికి "తెలింగ తుంగ తరూన్మూలన దంతావల" యను బిరుదముండినట్లు తెలుపఁబడినది. కుంతల దేశాధీశుఁడగు రాచమల్లదేవునకుఁ దెలగలమారి యను బిరుదముండెను.

" పశ్చాత్పురస్తాదపి యస్య దేశౌ
ఖ్యాతౌ మహారాష్ట్ర కలింగసంజ్ఞౌ
వవాగుదక్ పాండ్యక కన్యకుబ్జౌ
దేశస్స తత్రాస్తి త్రిలింగనామ.
పురా త్రిలింగాన్ ప్రతిమంచి కొండౌ
వాహానయన్ నాయకవంశ ముఖ్యౌ
తాభ్యాం వినిర్మాపితమాత్మ నామ్నా
పురం మహచ్చ ప్రథితేంధ్ర దేశే "

అను శ్లోకము ఎపి గ్రాఫియా ఇండికా 14-వ సంపుటమున వ్రాయఁబడియున్నది. శా. శ. 1539 సంవత్సరమున మీసరగండకటారిసాలువ తెలుంగురాయఁ డుండినట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది. ప్రతాపరుద్రీయమున త్రిలింగశబ్దము వాడఁబడియున్నది. అల్లాఉద్దీనను తురుష్క రాజు తిలంగదేశమును జయించినట్లు తెలియుచున్నది. తెలుంగు బిజ్జలుఁడను వాఁడు నెల్లూర రాజ్యమేలిన తెలుఁగుచోడుల వంశములోనివాఁడు. ఈ రీతిగా నున్న దేశపుపేళ్లను సంస్కృతీకరించి త్రిలింగశబ్దమును పండితులు కల్పించి నారని యనుకొనుట కవకాశమున్నది.

తెలుఁగుశబ్దము త్రినగశబ్ద భవమని మఱికొందఱు అందురు. మహేంద్రము, శ్రీశైలము, కాళహస్తి యను మూఁడునగముల మధ్యనున్న ప్రదేశము త్రినగదేశమనియుఁ ద్రినగశబ్దమే తెనుఁగుగా మాఱినదనియు వారి యభిప్రాయము. త్రినగశబ్దమునందు లేని యనుస్వారము తెనుఁగుశబ్దమునం దుండుటయు, తెనుఁగుదేశమునకుఁ ద్రినగమను వ్యవహార మేనాఁడును లేకుండుటయు నీ వ్యుత్పత్తి కాధారము లేనట్లు తెలుపఁగలదు.

త్రికళింగ శబ్దభవము తెలుఁగని మఱికొందఱు అనుచున్నారు. త్రికళింగశబ్దము ప్రాకృతమున 'తిఅలింగ' యని మాఱి తెలింగ, తేలింగ యను రూపములను పొందుట సాధ్యమేయైనను తెనుఁగుదేశ మంతటికిని త్రికళింగసంజ్ఞ లేకుండుటచే నీ వ్యుత్పత్తియు నిరాధారమగుచున్నది. త్రికళింగ మనునది యిప్పటి గంజాము, విశాఖపట్టణము జిల్లాలును వానికి పడమటి మధ్య పరగణాలలోని కొంతభాగమును నయి యుండెను. నేటి ముఖలింగమున్న ప్రదేశమునకు మోదోగలింగే యను పేరు గ్రీకు చరిత్రకారుల వ్రాఁతల యందుఁ గాన్పించుచుండుటచే మోదో అనగా మూఁడగు అని అర్థము చెప్పి కొని త్రికళింగమునకు మూఁడగు కళింగమని యర్థముచెప్పి యా త్రికళింగ శబ్దమునుండి తెలుఁగను పదము పుట్టినట్లు కేంబెల్ మొదలగు పాశ్చాత్య

పండితు లభిప్రాయపడిరి. మోదోగలింగ మనునది మధూకలింగ శబ్దభవము గాని మూఁడగు కళింగము అనుదాని మాఱురూపము కాదు. మూఁడగు కళింగమని త్రికళింగమున కెన్నడును వ్యవహారము లేదు.

తేనె + అగు, అనఁగా తేనెవలె తియ్యనిదగుటచే తెనుఁగయ్యెనని కొందఱును తెలి + అగు = తేలికయగు, లేక స్వచ్ఛమగునట్టిది కావున నీ భాషకుఁ దెలుఁగను నామము వచ్చెననియుఁ గొందఱి యభిప్రాయము. ఈ వ్యుత్పత్తి కేవలము స్వాభిమాన పూరితమని వేఱె చెప్పనక్కఱలేదు. తెన్ అనగా దక్షిణమని తమిళమున నర్థముండుటచే దక్షిణదేశపు భాషగావునఁ దెనుఁగను పేరు గలిగినదని కొందఱనుచున్నారు. తమిళులకుఁ దెలుఁగువా రుత్తరమున నుండుటచేతను, తెలుఁగువారు తమ్ము దక్షిణదేశపు వారమని చెప్పుకొనుట యసంభవ మగుటచేతను నీ వ్యుత్పత్తికూడ సమంజసముగ లేదు.

కన్నడకవియగు నృపతుంగుఁడను రాజు తాను రచించిన కవిరాజమార్గమను లక్షణగ్రంథమున గోదావరినుండి కావేరివఱకుఁగల ప్రదేశమంతయుఁ గర్ణాటకసంజ్ఞను గలిగియున్నదని చెప్పియున్నాఁడు. కన్నడమునం దాదికవులగు పంప, రన్న, పొన్న, యనువారు వేంగీదేశవాసులయినట్లు వారి గ్రంథములవలనఁ దెలియుచున్నది. ఇంతేకాక పూజ్యపాదుఁడు (క్రీ. శ. 470) దండి (క్రీ. శ. 7-వ శతాబ్దము), నాగార్జున (క్రీ. శ. 8 శతాబ్దము), నాగవర్మ (క్రీ. శ. 990), రాజాదిత్య (క్రీ. శ. 1120), మైదునరామయ్య (క్రీ. శ. 1160), మోళిగెయ్య (క్రీ. శ. 1160), మసణదేవ (క్రీ. శ. 1160), మల్లికార్జున పండితారాధ్య (క్రీ. శ. (1160), హరీశ్వర, రాఘవ, కెరెయపద్మరస (క్రీ. శ. 1165), చక్రపాణి రంగనాథ (క్రీ. శ. 1195), పోలాళ్వ దండనాథ (క్రీ. శ. 1223), భీమకవి (క్రీ. శ. 1369),—వీరును నిట్టివారు మఱికొందఱును తెనుఁగుదేశమువారు కన్నడమున గ్రంథములను రచియించియున్నారు. ఓరుగంటియందును హంపీ - విజయనగరమునందును రాజులు తెలుఁగు కన్నడముల నొక్కరీతిగఁ బ్రోత్సహించియుండిరి. శ్రీనాథుఁ డానాఁటి వాడుకను బట్టి కాబోలు తెలుఁగును కర్ణాటభాష యన్నాఁడు. ఇట్లే కన్నడదేశము నందును తెనుఁ గెక్కువ ప్రచారములోనున్నది. నేఁటి కర్ణాటకదేశమగు మైసూరు సీమయందలి కోలారు, బెంగుళూరు, చిత్రదుర్గము, నందిదుర్గము జిల్లాలయందు చాలవఱకుఁ దెలుఁగే ప్రచారములోనున్నది. దీనినిఁబట్టి కన్నడమువారును తెలుఁగువారును మొదటినుండియుఁ గలసియుండుట [illegible] యొకరిభాష నొకరు బోధపరుచుకొనఁ గలిగియుండిరని యూహింప[illegible]

ఈ రెండుజాతులవారికిని ప్రాచీనతనలెనే భాషయు నొక్కటిగానె యుండ నోపును. ఆచార వ్యవహారములందును మతాది సంప్రదాయములందును నీరెండు జాతులవారికిని నొకరీతి నైక్యముండినటుల గోచరించును. కన్నడ భాష యయిదువిధములుగా నున్నదనియు [illegible] బెళు గన్నడమను వ్యవహారమున్నదనియుఁ, [illegible]గన్నడమనంగా [illegible] తమ మూలస్థానమునువిడిచి దూరదేశములకు [illegible] భాషను [illegible]గా నుచ్చరించుటవలనఁ గలిగినభాషయనియు, నొక [illegible] చెప్పి యున్నాఁడు. ఇట్లే "ఖండ" అనగా [illegible] [illegible] భాష కుడ గన్నడమనియు, కుడగన్నడమే [illegible] వ్యవహార మందున్న దనియుఁ జెప్పుదురు. ఈ [illegible] ప్రాగ్గన్నడము తెలుఁగుగా వ్యవహరింపఁ బడుచున్నదని [illegible]. [illegible] నందు దెలుఁగు కన్నడములకు నూటికి తొంబది[illegible] నున్నది. అట్లే ప్రత్యయాది సంబంధమును మిక్కిలి [illegible]. ఈ కారణముల చేతఁ దెలుఁగు కన్నడము లొకప్పు[illegible]భాషగా నుం[illegible] కాలక్రమ మున మాండలిక భేదమునుబట్టి యవి భిన్నముగ [illegible] నూహించుట కవకాశము గలదు.

తెనుఁగు శబ్దములోని గుప్రత్యయమును గూర్చి [illegible]విచారము చేయవలసి యున్నది. గు, కు, క, గ, క్, గ్, [illegible], [illegible], క, [illegible] ప్రత్య యము లంత మందుగల భారతీయ భాషలనుగూర్చి [illegible] తెలుఁగు శబ్దమునందలి గుప్రత్యయ తత్త్వము [illegible]. [illegible] దేశ భాషలలోఁ గన్నడమునకు "హావిక" యను [illegible]. తమిళ మును కొన్ని ప్రాంతములలో "సొలగ" లేక "[illegible]" [illegible]. "పుల్‌రంగ్" అనునది తమిళభాషామాండలిక భేదము [illegible]భాషకు మఱియొక పేరు. నీలగిరులలోఁ దమిళభాషా భేదము [illegible] "ఎరిల గారు" అను మఱియొక పేరున్నది. తమిళభాషాభేదము [illegible] భాషలో "ఎర్నగ" లేక "సింగ్లి" యనుపేరున్నది. [illegible] "[illegible]-గు", కోటా-కూ అనియు కొరగ, [illegible], [illegible], [illegible], [illegible]యనుపేళ్లు గూడ నున్నవి. బడగభాషయనునది కన్నడభాషా[illegible]. [illegible] బడక్ అని కూడనందురు. కొడగుభాష కన్నడభాషా[illegible]. [illegible] యనునది తెనుఁగుతో సంబంధించిన "కుయి" అను భాషకు [illegible]. "[illegible]య్ లోంగ్" అనునది కొంకణీ మళయాళభాషల సమ్మే[illegible] [illegible] గలిగినది. భత్కల్, బుత్కల్ అనుభాష మరాఠీభాషావికారగ్రస్తమైన [illegible]భాషా భేదము. "ధనగరీ" యనునది మరాఠీభాషకు మాండలిక రూపము. ఇట్లే

చేపటుక్, కోంగ్ పోంగ్, తోత్రిగ, యనునవి గూడ మరాఠీభాషా వికారములే.

టిబేటు దేశములోని భోటియా మండలమునందు గ్యారూంగ్, కైగిలి, డాన్జోంగ్-కా, యను భాషలున్నవి. ఇంక బర్మాదేశములోఁ జాల వఱకు భాషలు సంయుక్త వర్ణాక్షరాంతములుగాఁ గానఁబడు చున్నవి. ఉదాహరణములు:—ఘోక, గిరు, గురు, హిరోఇలమ్‌గాంగ్, గన్నాగ, హ-అంగ్, హ్యాంగ్, హ్మోంగ్, హాకొమైంగ్, హాకొమోంగ్, హాకొర్ త్సెంగ్, హ్రాంగ్-ఖోల్, ఇంబంగ్, ఈషంగ్, జక్ తుంగ్, హు అల్నిగో, క-హాంగ్, కంగ్, కత్ లంగ్, ఖా-ఖోంగ్, ఖుగ్-నాస్, ఖుగ్నీ, ఖులుంగ్-ముదున్, ఖున్‌లోంగ్, ఖ్యంగ్ (ప్యంగ్), ఖ్యాంగ్, క్లుప లోంగ్, ఖానుంగ్, నుంగ్, కోమ్‌సోంగ్, కోల్స్వా రెంగ్, కోతుంగ, కుకిలోంగ్, క్విన్‌పంగ్, క్వోయ్‌రెంగ్, (లీయాంగ్), లకూ, లల్లైంగ్, లాలుంగ్, లంగ్రోంగ్, లంగ్‌తుంగ్, లఖంగ్, లాక్‌లంగ్, లెంగ్ లుంగ్, మాంగ్, లోంగ్, మోపాంగ్, మ్రుంగ్, ములుంగ్, ముంగ్, ముంటెంక్, సమసంగ్, సిరింగ్, పల్లంగ్, పల్లైంగ్, ఫడంగ్, ర-అంగ్, రాబ-కివ్యగ్, రెవంగ, రేలంగ్, రి-అంగ్, రోంగ్, రుబ్రంగ్, సైంగ్ బాంగ్, సెరంగ్, సెంపరెంగ్, సెంతుంగ్, షైయాంగ్, తాంగ్-ఖుల్, షామ్ తురూంగ్, సిన్లెంగ్, సీయుంగ్, సొంగ్‌లోంగ్, స్త్రీఎంగ్, తఅంగ్, తబైంగ్, తబాంగ్, తల్లేంగ్, తైచౌంగ్, తైఖాంగ్, తపోంగ్, తరేంగ్, తవ్‌హాక్వాంగ్, తయంగ్, తియుంగ, త్రంత లంగ్, త్విలిఛంగ్, వెలాంగ్, యబైంగ్, యకైంగ్, యల్లైంగ్, యమలంగ్, యంగ్ కా లెంగ్, యెమ్‌పాంగ్, రి అంగ్, అంగ్‌కె, అక, అకో, అంగ్‌కూ, ఆంగ్‌వాస్-కూ (తల్లైంగ్) అనుంగ్, నుంగ్, ఖునుంగ్, అమైంగ్, బెయ్యు, బోక, డ-అంగ్, ద-ఎంగ్, దరాంగ్, పతాంగ్, దిగారు, దులేంగ్.

ఈ క్రిందభాషలు టిబెటో- బర్మనుభాషా వర్గమునకుఁ జేరినవి:—గురుంగ్, పిదంగ్, లీయుంగ్, లోయ్‌లోంగ్, మంగ్, తోంగ్, లొంగ్, మ్హాంగ్, ఆల్లంగ్, అరుంగ్, ఎమ్బ్విన్ ఛేపాంగ్, ఛిన్‌బోక్, చ్యాంగ్, ఖ్యాంగ్,

ఈ క్రిందభాషలు అస్సాము దేశములోనివి:—ధేకేరీ, ఛిబోక్, డైకో, ఖంగోయ్, కోస్యక్, మయాంగ్, మిలెనసంగ్, మించాణంగ్, మియాంగ్‌ఖంగ్, మూజుంగ్, వనాంగ్, అస్సిరింగియా, అసురింగ్, ఆతింగ్, ఆతోంగ్.

ఈక్రింద భాషలు నేపాళదేశములో వ్యవహారములో నున్నవి:—ఛింగ్‌తాంగ్, గోరఖాలి, గోర్ఖియా, ఖాలింగ్, కూలుంగ్, ఖాంబూ, వాలింగ్, ఖంబూ, బాహింగ్.

ఉత్తర హిందుస్థాన భాషలలో ఓఢ్రభాషావికారములగు [illegible]లో, బంగాలి, ఉత్కలీ భాషలును, తూర్పు హిందీభాషావికారములగు "కలంగ" భాషయును పశ్చిమ హిందీభాషావికారములగు [illegible], [illegible] భాంగ్, డాంగీ, భాషలును, బంగాళము, ఒరిస్సా, బీహారము, [illegible] నాగపురము దేశములలో సంచారశీలురగు నొకజాతివారి మాట్లాడు "[illegible] [illegible]" భాషయును, బంగాళాదేశములోని బంగి, [illegible]ంగ్, [illegible], [illegible]ంగా, భాషలును, మార్వాడీ భాషావికారములగు [illegible], [illegible], [illegible] భాషలును, నిట్టి ప్రత్యయములనే కలిగియున్నవి. [illegible] భాషా వికారము. అవాంకారీ, అవాంకీ, అనుభాష [illegible] లోని కోహాత్ జిల్లాలోనిది. ఇది లహందా భాషా[illegible]. [illegible]నుభాష హిమత్పర్వత పాదమునందలి పహాడభాష[illegible] [illegible]మానీ భాష యంతర్భాగము, [illegible], [illegible], [illegible] ప్రదేశములో ప్రచారమున నున్నవి. పశ్చిమోత్తర [illegible] భాషయందుఁ గూడ నీ ప్రత్యయము కనఁబడుచున్నది. [illegible] కాశ్మీర ప్రాంతమునందలిది. ఖ్లాంగ్, ఫలగారి, [illegible], [illegible], [illegible] అనునవి ముండా భాషావిశేషములు.

బర్మాలో తలైంగ్ అనునొక భాషయున్నది. ఇది ఆస్ట్రో-ఏషియాటిక భాషా కుటుంబమునకుఁ జేరిన మాన్-ఖ్మేర్ శాఖకు సంబంధించినది. దీనిని మాట్లాడువారి సంఖ్య 224424. ఇది బర్మాలోని [illegible], [illegible] జిల్లాలోఁ బ్రచారముననున్నది. తలైంగ్-కలసీ యనునొక భాష బర్మాలోని [illegible]మే ధిను జిల్లాలో వాడుకయందున్నట్లు తెలియవచ్చుచున్నది. తలైంగ్ [illegible]యున్, అను మఱియొక భాష బర్మాలోని చాలజిల్లాలలో వాడుకలో నున్నట్లును దానిని 352466 మంది మాట్లాడుచున్నట్లును బర్మాదేశపు జనాభా లెక్కల వలనఁ దెలియుచున్నది. బర్మాలోని యుత్తర భాగమున తలైంగ్ అనునొక భాషను 18074 మంది మాట్లాడుచున్నారఁట. [illegible] దేశములో తురాంగ్ అను మఱియొక పేరుగల తైరాంగ భాషయున్నది. [illegible] దేశములో థూలుంగ్ అనునొకభాష మాట్లాడఁబడుచున్నది. బర్మాలోని తలైంగ్ దేశమునకును తెలుఁగుదేశమునకును చిరకాలమునుండి వాణిజ్యాది సంబంధముండినట్లు బర్మాదేశపు చరిత్రమువలనఁ దెలియవచ్చును. కాని తెలుఁగు భాషకును తలైంగ్ భాషకును నేఁడెట్టి సంబంధమును సన్నిహితముగా దానిని కనిపెట్టుటకు వీలులేకున్నది. నేఁడు ప్రిజులిస్కీ మొదలగు పండితులు ఆస్ట్రిక్ భాషలకును ద్రావిడభాషలకును సంబంధమున్నట్లు తెలియఁజేయుచుఁ దద్విషయమై పరిశోధనములఁ గావించుచున్నారు. పరిశోధనముల మూలమున

చేమపుక్, శాంగ్ పాంగ్, శోత్రిగ, యనునవి గూడ మరాఠీభాషా వికారములే.

టిబేటు దేశములోని భోటియా మండలమునందు గ్యారూంగ్, కైగిలి, డాన్జోంగ్-కా, యను భాషలున్నవి. ఇఁక బర్మాదేశములోఁ జాల వఱకు భాషలు సెంప్ర్య వర్గాతురాంతములుగాఁ గానఁబడు చున్నవి. ఉదాహరణములు:—ఫేుక, గిను, గుకు, హిరోఇలమ్‌గాంగ్, గన్నగ, హ-అంగ్, హ్మాంగ్, హ్మోంగ్, హాకామైయొంగ్, హామామోంగ్, హాకాత్సెంగ్, హ్రాంగ్-ఖోల్, ఇంబంగ్, ఈపంగ్, జక్ తుంగ్, హు అల్న్గో, క-హంగ్, కంగ్, కత్ లంగ్, ఖా-ఖోంగ్, ఖుగ్-నాస్, ఖుగ్నీ, ఖులుంగ్-ముదున్, ఖున్‌లోంగ్, ఖ్యంగ్ (ప్యంగ్), ఫ్యంగ్, క్లున లోంగ్, ఖానుంగ్, నుంగ్, కోమ్‌రోంగ్, కోష్ణారెంగ్, కోతంగ్, కున్‌లోంగ్, క్విన్‌పంగ్, క్వోయ్‌రెంగ్, (లీయాంగ్), లకూ, లల్లెంగ్, లాలుంగ్, లంగ్రోంగ్, లంగ్‌తుంగ్, లఖంగ్, లాక్‌లంగ్, లెంగ్‌ఖంగ్, మాంగ్, లోంగ్, మోపాంగ్, మ్రుంగ్, ములుంగ్, ముంగ్, ముంతెుక్, నమసంగ్, సరింగ్, పల్లంగ్, పల్లెంగ్, ఫడంగ్, ర-అంగ్, రాబ-కంబ్వగ్, రెవంగ్, రేఅంగ్, రి-అంగ్, రోంగ్, రుబ్రంగ్, సైంగ్ బాంగ్, సెరం గ్, సెంపరోంగ్, సెంతుంగ్, షైయాంగ్, తాంగ్-ఖుల్, షామ్ తురాంగ్, సిన్లెంగ్, సీయుంగ్, సొంగ్‌లోంగ్, స్త్రీఎంగ్, తఅంగ్, తబైంగ్, తబాంగ్, తశ్లోంగ్, తైచాంగ్, తైఖాంగ్, తపోంగ్, తరేంగ్, తవ్‌హాన్వంగ్, తయం గ్, తెయుంగ్, త్రంత లంగ్, త్విలిఛంగ్, వెలాంగ్, యబైంగ్, యకైంగ్, యల్లెంగ్, యమలంగ్, యంగ్ కా లెంగ్, యెమ్‌పాంగ్, రి అంగ్, అంగ్‌కె, అక, అకా, అంగ్‌కూ, ఆంగ్‌వాస్-కూ (తల్లెంగ్) అనుంగ్, నుంగ్, ఖునుంగ్, అయెంగ్, బెయ్కు, బోక, ద-అంగ్, ద-ఎంగ్, దరాంగ్, పతాంగ్, దిగారు, దులేంగ్.

ఈ క్రిందిభాషలు టిబెటో- బర్మనుభాషా వర్గమునకుఁ జేరినవి:—గురుంగ్, పిదంగ్, లీయుంగ్, లోయ్‌లోంగ్, మంగ్, తోంగ్, లోంగ్, హ్మాంగ్, అల్లంగ్, అరుంగ్, ఎమ్బెన్ ఛేపాంగ్, ఛిన్‌బోక్, చ్యంగ్, ఖ్యంగ్,

ఈ క్రిందిభాషలు అస్సాము దేశములోనివి:—ధేకేరీ, ఛిబోక్, డైకో, ఖంగోయ్, కోస్యక్, మయాంగ్, మిలెనంగ్, మింఛాణంగ్, మియాంగ్‌ఖంగ్, మూజుంగ్, వనాంగ్, అస్సిరింగియా, అసురింగ్, ఆతింగ్, ఆతోంగ్.

ఈ క్రింది భాషలు నేపాళదేశములో వ్యవహారములో నున్నవి:—ఛింగ్‌తాంగ్, గోరఖాలీ, గోర్ఖియా, ఖాలింగ్, కూలుంగ్, ఖంబూ, వాలింగ్, ఖంబూ, బాహింగ్.

నాంధ్రదేశమునకు సంబంధించిన బౌద్ధమత గ్రంథమగు అట్ఠకథలోని భాషయు నొక్కటియే యయియుండు టీయూహాకాధారము.

గ, గు, ప్రత్యయములు సంస్కృతములోని క ప్రత్యయమునకుఁ బ్రాకృతభాషా వికారములని చెప్పుట కవకాశమున్నది. పూసగి, గోసిగి, ఓడంగి, కోణంగి, వడ్రంగి, మొదలగు శబ్దములలోని ప్రత్యయములు సంస్కృతములోని క, కి, ప్రత్యయ వికారములే. మధ్యపరగణాలలోని తేల్‌నదీ ప్రాంతమునుండి వచ్చినవారగుటచే తెలుఁగులను నామము కలిగినదని కొందఱు చెప్పుదురు. తైలికశబ్దభవము తెలుఁగని కొందఱి యభిప్రాయము. తెలివిగల వారు కావున తెలుఁగులను పేరు గలిగినదని కొందఱందురు. తెలఁగను పదము సంస్కృతములోని ధవల, త్రిస్త, దృస్త మొదలగు శబ్దముల ప్రాకృతవికారము కావచ్చును. ఈ వ్యుత్పత్తులన్నియు నూహామాత్రములు. తెలుఁగుశబ్దము వ్యుత్పత్తినిగూర్చి ఇదమిత్థమని చెప్పుటకు నేటికిఁదగిన ప్రమాణములు లభింప లేదని మాత్రము చెప్పి యింతటితో విరమింపవలసి యున్నది. ఈ విషయమై "జనపదేలుప్; తదశిష్యం సంజ్ఞాప్రమాణత్వాత్." "లుబ్యోగా- ప్రఖ్యానాత్" "యోగప్రమాణేచ తదభావేఽదర్శనంస్యాత్," "ప్రధాన ప్రత్యయార్థవచన మర్థస్యాన్య ప్రమాణత్వాత్," అను పాణినీయ వచనములను స్మరింపవలసియున్నది.

తెనుఁగు భాషకుఁ దమిళదేశమునందు వడుగ, బడగ, యను పేర్లున్నవి. పోర్చుగీసువారు తెనుఁగును బడగేస్ అని పిలుచుచుండిరి. జర్మనులు దానిని వరుగ యనిరి. ఐరోపియనులు తెనుఁగును జెంటూ భాషయని పిలుచుచుండిరి. ఈపదము పోర్చుగీసు శబ్దమగు జెంటియో, (అనఁగా మ్లేచ్ఛుఁడు, క్రైస్తవేతరుఁడు) అనుపదమునకు వికారము.

తెలుఁగునకు సంబంధించిన కొన్నివికార రూపములనుగూర్చి యింతకుఁ ముందుఁ దెలుపఁబడినది. వానికిఁ క్రింది యుదాహరణములు లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా 4-వ సంపుటమునుండి తీసికోఁనఁబడినవి.

---

## కోంటావుభాష.

---

ఒక మనిషికి యిద్దఱు పిల్లగాండ్లు వుండిరి. వాండ్లలో చిన్నవాడు తండ్రితో అంటాడు, "తండ్రి, యేదో మాలమతుట నాకు వచ్చేసలది అది యివ్వు." వెనకవాఁడు పిల్లనికి ధనము పంచి ఇచ్చిండు. వెనక కొన్ని దేవ సాలకు చిన్నపిల్లడు అంత సొమ్ము జేమాజేషి దూరదేశానకు పోయిండు

